పురావస్తు ప్రచురణ 61

# అమరావతి
# క్రొత్త శాతవాహన శిల్పాలు


రచయితలు

**పి. సీతాపతి,** ఎమ్. ఎ. (లీడ్స్) బి. ఎస్‌సి.,
ఎఫ్. ఆర్. ఏ. ఎస్. (లండన్) ; ఐ.ఎ.ఎస్.,

మరియు

**ఎస్. నారాయణరావు.** ఎమ్. ఎ.










ప్రచురణకర్త
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
హైదరాబాదు.
**1988.**

# వి షయ సూ చి క

# అమరావతి

# క్రొత్త శాతవాహన శిల్పాలు

## చారిత్రక పూర్వరంగం

మౌర్య సామ్రాజ్య పతనానంతరం దక్కన్‌లో అత్యంత శక్తివంతులైన శాతవాహన వంశమువారు స్వతంత్రులైనారు. కొందరు విద్వాంసుల అభిప్రాయం ప్రకారం శాతవాహనుల ప్రథమ రాజధాని కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళంలో ఉండేది. తర్వాత ధాన్యకటకానికి, అక్కడనుండి యితర చోట్లకు మార్చబడింది. ఇటీవలి కాలంలో శిముకుడు లేక చిముకుని నాణేలు కొన్ని కరీంనగర్ జిల్లాలోని కోటిలింగాలలో కనుగొనబడ్డాయి. శ్రీముఖుడు శాతవాహన వంశానికి మూల పురుషుడని చాలా పురాణాలు చెపుతున్నాయి. దొరికిన నాణేలను బట్టి కణ్వరాజకుమారుని మరణానంతరం శాతవాహనులు చిముకుని నాయకత్వంలో స్వాతంత్ర్యం ప్రకటించుకొన్న తర్వాత తెలంగాణాలోని కరీంనగర్ పరిసరాలలో తమ రాజధానిని ఏర్పరచుకొన్నారనే ఊహ బయలుదేరింది. ఈ ఊహ బొత్తిగా నిరాధారమైనదికాదు. కరీంనగర్ ప్రాంతంలోని కోటిలింగాల, ఉత్తర దక్షిణాలను కలుపుతున్న రాజమార్గం మీద ఉంది. ఇటీవలి పరిశోధనల వలన అక్కడ అనేకమైన శాతవాహన క్షేత్రాలు, బౌద్ధస్తూపాలు కనుగొనబడ్డాయి. ఆప్రాంతంలో ప్రస్తుతం జరుగుతున్న పురాతత్త్వ త్రవ్వకాలు వీటిని గురించి మరింత ఎక్కువ విశదపరచవచ్చు.

ప్రసిద్ధ చైనా యాత్రికుడు హుయేన్ త్సాంగ్ క్రీ. శ. 629–645 సంవత్సరాల మధ్య ధాన్యకటకాన్ని సందర్శించాడు. సుప్రసిద్ధ బౌద్ధమతాచార్యుడు, మాధ్యమిక సంప్రదాయ స్థాపకుడు అయిన ఆచార్యనాగార్జునుడు దక్షిణ భారతదేశంలో విస్తృతంగా పర్యటించి, దక్షిణాన బౌద్ధసంఘ పరిరక్షణకు ఎక్కువగా తోడ్పడ్డాడని, ఒరిస్సాలోను తదితర చోట్లను ఎన్నో విహారాలను స్థాపింపజేశాడనీ, ముఖ్యంగా ధాన్యకటక మహాస్తూపాన్ని, అలంకారప్రాయమైన ప్రాకారాన్ని (railing) అమర్చిపెట్టాడనీ, టిబెట్టు మూలాధారం ఒకటి తెలియజేస్తోంది. క్రీ. శ. 174 నుండి 202 వరకు దక్కన్‌ను పరిపాలించిన ప్రసిద్ధశాతవాహన చక్రవర్తి యజ్ఞశ్రీ శాతకర్ణి కాలంలో ఆచార్య నాగార్జునుడు తనజీవిత చరమ భాగాన్ని శ్రీపర్వతంవద్ద గడిపాడని చాలమంది నమ్మకం. అమరావతి వద్దనున్న మహాస్తూపం చుట్టూఉన్న ప్రాకారం శాతవాహనుల కాలంలో నిర్మితమైనదని స్పష్టంగా తెలుస్తున్నది. స్తూపానికి శిల్పాలతోకూడిన రాతి పలకలు శాతవాహనుల కాలంలో విరాళంగా లభించి ఉండాలి.

అమరావతిని ధన్యకటకం, ధాన్యవాటి, ధాన్యకటకం, ధరణికోట, ధన్నడకోట, ధరణాలకోట అనిపిలిచేవారు. టోలేమి, హుయేన్‌త్సాంగ్‌లు ధనకటకం అనే ఉల్లేఖించారు. ధరణికోట అనేపేరు ప్రథమంగా ప్రోలయ వేమారెడ్డి శాసనం ఒకదానిలో కనిపిస్తుంది. అక్కడ ఆతడొక కోటను నిర్మించి నట్లు తెలుస్తోంది. క్రీ. శ. 1182 చెందిన ఒక శాసనంలో బుద్ధుని పవిత్రావశేషాలను భద్రపరచిన ధనకటకచైత్యం సురపురం (అమరావతి) వద్దనున్నట్లు వ్రాయబడింది.

ధాన్యకటకాన్ని గురించి ప్రముఖంగా ఉల్లేఖించినవాడు హుయన్‌త్సాంగ్. ఆతడు కోసల నుండి యిక్కడికి వచ్చాడు. నాటి కోసల నేటి మహారాష్ట్రలోని చాందా జిల్లాలోది. అది ఆంధ్రప్రదేశ్ లోని కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలను ఆనుకొని ఉంది. 'అంతోలో' (ఆంధ్ర) రాజధాని 'పింగ్‌కి'లో, కోసలకు నైరుతి దిశలో 240కి.మీ. దూరాన ఉన్నట్లుగా అతడు వ్రాశాడు. దాని ఆధారంగా ఆధునిక విద్యావేత్తలు కొందరు ఆదిలాబాద్ జిల్లాలోని చెన్నూరును, కొందరు వరంగల్లును, మరికొందరు ఏలూరు దగ్గర వేంగీని, రాజధానిగా నిర్ధారించారు. ఆచైనా యాత్రికుడు ఆంధ్రరాజధాని నుండి ధనకటకం వరకు 265 కి. మీ. ప్రయాణించాడు. ధనకటకంలో బౌద్ధవిహారాలు ఎక్కువగా ఉన్నాయనీ, అప్పటికే బౌద్ధులు చాల వాటిని వదిలి వెళ్లిపోయారనీ అతడు వ్రాశాడు. అతనికాలంలో 100 హిందూ దేవాలయాలు ఉండేవి. రాజధానికి తూర్పుగా ఒక చిన్నకొండ మీద పూర్వశిల లేక తూరు కొండ అనే పేరుతో ఒక విహారం ఉండేది. నగరానికి పడమరగా అపరశిల ఉండేది. ఈపూర్వశిల అపరశిల విహారాలు, బహుశా బౌద్ధమతంలోని రెండు తెగలను సూచిస్తూ ఉండవచ్చు.

బుద్ధుని మహాపరినిర్వాణం తర్వాత క్రీ. పూ. 480 ప్రాంతంలో ఆయన భౌతిక అవశే షాలను ఎనమండుగురు పోటీదారులు పంచుకొన్నారని వాటిని వారు తమతమ ప్రాంతాలలో స్తూపాలు చేట్టి, వాటిలో భద్రపరచారని బౌద్ధ సాహిత్యం మనకు చెప్తుంది. జనశ్రుతి ప్రకారం అశోకుడు మొత్తం మీద ఎనభైనాలుగు వేల స్తూపాలను నిర్మించాడని చెప్తారు. స్తూపంలో ప్రధానమైన నాలుగు భాగాలుంటాయి.

1. గర్భం 2. అండం 3. హర్మిక 4. ఛత్రం. గర్భానికి నాలుగు దిక్కులా ఆయక వేదికలు నిర్మించి, వాటిపైన బుద్ధజీవిత ప్రధాన ఘట్టాలైన జన్మ, పరిత్యాగ, జ్ఞానోదయ, ధర్మచక్ర ప్రవర్తన, మహాపరినిర్వాణాలకు సంకేతాలుగాఐదు ఆయక (ఆర్యక) స్తంభాలు నిర్మించడం విశేషం.

తరువాత కాలంలో బౌద్ధసన్యాసవ్యవస్థలో మహాసాంఘికులు, మహాస్థవిరులు అనే రెండు చీలికలు వచ్చినవి. ఈచీలిక క్రీ.పూ. 387లో రాజగృహంలో జరిగిన ప్రథమ బౌద్ధ మహాపరిషత్తుకు నూరుసంవత్సరాల తర్వాత అనగా సుమారు రెండవ బౌద్ధమహాపరిషత్తు సమయంలో క్రీ.పూ. 487 లో జరిగింది. మహాసాంఘికులు తిరిగి, చైత్యికులు, చైత్యశైలురు, లేక పూర్వశైలురు, అపరశైలురు హైమవతులు మరియు లోకోత్తర, ప్రజ్ఞాపతివాదినులు అనే ఐదు సంప్రదాయ శాఖలుగా పునర్విభ

జించబడ్డారు. నాగార్జున కొండ వద్దకు బౌద్ధులు ఏ ఏ ప్రాంతాలనుండి వచ్చారో ఆయా ప్రాంత నామాలైన బారావాసిక, సింహల మొదలైన పేర్లకు తోడు బహుశ్రుతీయులు, థేరవాదినులు, అపరమహావిన సేలియులు వంటి శాఖలు కూడ, మనకు కానవస్తాయి.

బౌద్ధపురాణం యొక్క మూలస్వరూపమే ఆయా సమయాలలో వివిధ మార్పులకు లోనైంది. బౌద్ధమత చరిత్రను హీనయాన, మహాయాన, వజ్రయాన అని మూడుగా విభజించవచ్చును. హీనయానానికి మహాయానానికిగల ముఖ్యమైన భేదం హీనయానులు అరహంతత్వాన్ని మోక్షప్రదమైన సర్వోన్నత స్థితిగా పరిగణిస్తారు. ప్రతివారు బుద్ధత్వాన్ని అందుకోలేరని వారి నమ్మిక. మహాయానుల భావం ప్రకారం, ప్రతివ్యక్తి ఆదినుంచీ పరిశుద్ధుడే; చివరకు బుద్ధత్వాన్ని అందుకోగలవాడే. మోక్ష ప్రాప్తికి యితరులకు సహాయపడగలడు కూడ. మహాయానులు బుద్ధుని లోకోత్తరునిగా భావిస్తారు. హీనయానంనుండి మహాసాంఘికశాఖ విడిపోయినపుడు బుద్ధుని దేవుని చేశారు. మహాయానులు లెక్కలేనంత మంది బుద్ధులు, బోధిసత్త్వుల ఉనికిని విశ్వసిస్తారు. వారు దేవీ, దేవతలు, ఉపదేవతల విగ్రహ పూజను అంగీకరించడమే కాకుండా, మోక్ష ప్రాప్తికి మంత్రాలు ప్రయోజనకారులని కూడ అంటారు. తరువాతి దశలో మంత్రయానం, పరమితయానం, అనే పేర్లతో మహాయానం రెండు శాఖలుగా చీలిపోయింది. తాంత్రిక బౌద్ధానికి మంత్రయానం ప్రారంభదశ. వజ్రయానులు పరమాత్మను వజ్ర సత్త్వునిగా గుర్తిస్తారు. వజ్రసత్త్వుని వజ్రధరుడు అనికూడ అంటారు.

దేవలోక, బ్రహ్మలోకాలలోని వారి అందరికంటె కూడ బుద్ధుడు ఎక్కువైనవాడని హీనయాన, మహాయాన శాఖల బౌద్ధ పురాణాలు చెప్పవి. చాతుర్మహారాజిక ప్రపంచాలు అని భావించబడే నాలుగు దేవలోకాలను గురించి కొన్ని గ్రంథాలు ఉటంకినాయి. భూమి నాలుగు దిక్కులను, నలుగురు దిక్పాలురు పరిపాలిస్తారనే హిందూ విశ్వాసానికి యిది సాదృశంగా కనిపిస్తుంది. అనేకమైన యితర హైందవ దేవీ దేవతలను మహాయానులు ఎరవు తెచ్చుకున్నారు. మచ్చుకు కొందరి పేర్లు, చక్ర, ఇంద్ర, విశ్వకర్మ, వరుణ, ప్రజాపతి, విష్ణు, నారాయణ, సోమ, స్కంద లేక కుమార, శివ, యమ, కుబేర, సూర్య, చంద్ర, వాయు, అగ్ని మొదలైనవి. " సద్ధర్మపుండరీక " ప్రకారం శుక్ర, సూర్య, చంద్ర, మహేశ్వరులు బుద్ధుని అనుయాయులు. " కరండ వ్యూహ " వంటి మరికొన్ని గ్రంథాలు ఆదిత్యుడు, చంద్రుడు, మహేశ్వరుడు, నారాయణుడు, వాయువు, ధరణి, వరుణుడు—వీరు బోధిసత్త్వ అవలోకేశ్వరుని శరీరం నుండి ఉద్భవించారని తెలియజేస్తున్నాయి.

బౌద్ధ మతానికిచెందిన హీనయాన, మహాయాన, వజ్రయాన—మూడు శాఖలకు కూడ ఆంధ్ర దేశంలో ప్రాతినిధ్యం లభించింది. మొదటి బౌద్ధ సంస్థలలో ఎక్కువ భాగం హీనయాన శాఖకు సంబంధించినదిగా కనబడుతుంది. అందులో బుద్ధభగవానుని దేవమానవ యేకత్వభావం పూర్తిగా వ్యగ్యం. తొలి మహాయాన సంప్రదాయంలో కూడ అత్యధికమైన దేవతలకు, ఉపదేవతలకు,

మానవరూపంలోనే ప్రాతినిధ్యం లభించింది. కాని బుద్ధునికి మాత్రం బుద్ధపాదాలు, అగ్ని స్తంభం, ఛత్రం, సింహాసనం, స్వస్తిక, కుంభం మొదలైన ప్రతి రూపాలలో ప్రాతినిధ్యం లభించింది.

అమరావతిలోని మహాస్తూపం క్రీ. పూ. మూడవ శతాబ్ది ప్రాంతంలో, బహుశా మౌర్యుల కాలంలో నిర్మించబడి ఉంటుంది. అమరావతి స్తూపంలోని గర్భభాగం లేక (drum) 35 మీటర్ల వ్యాసం, పైభాగం 27 మీటర్ల వ్యాసం కలిగిఉంది, 6 మీటర్ల ఎత్తువరకు వెళ్ళింది. చక్కగా మలచ బడ్డ డాగోబాలు (Dagaba) చైత్యాలు మొదలైనవాటి రూపాలతో మలచబడిన రాతిపలకలు గర్భకు అలంకార ప్రాయంగా ఉండేవి. ఈ శిల్పాలు మహాస్తూపానికి అమర్చి ఉండేవి. ఈ శిల్పాల్లో కొన్ని మహాస్తూపం యొక్క సంపూర్ణ స్వరూపానికి ప్రతిరూపాలుగా నిలిచి ఉన్నాయి. 'గర్భం' వ్యాసం 42 మీటర్లు, "అండం" లేక గుమ్మటం (dome) 27 మీటర్లకు పైగా ఉండవచ్చని భావించి నప్పటికీ, ఒక్కొక్కటి 3.35 మీటర్లతో రెండు ప్రదక్షణపథాలు (terraces), సుమారు 2.1 మీటర్లతో మూడు ప్రదక్షిణపథాలు కాని, దానికి ఉండి ఉండాలి. ప్రకాశం జిల్లా దర్శి తాలూకాలోని చందవరం స్తూపానికి రెండు మిద్దెలున్నాయి. రాతిపలకలు ప్రక్కలనుండి పెద్దగా చొచ్చుకురాకుండా అతికట్టడానికీ, పనివాళ్ళు వాటిని తగినఎత్తుకు తీసికొనిపోవడానికి వీలు కల్పించడానికీ, తగిన నిర్మాణ పద్ధతి ప్రత్యేకంగా పొందు పరచబడింది. స్తూపం చుట్టూ నాలుగు అడుగుల ఎత్తున రెండు ప్రాకార శిల్పాలు (railings) ఉండేవి. ఉత్సవ సందర్భాలలో "అండం" పైనా, గుమ్మటం పైనా వందల కొలది దీపాలు పెట్టడం మూలాన అదొక దీపాల కొండలాగ కన్పించి "దీపాల దిన్నె" అనే సార్థక నామాన్ని పొందింది. అమరావతి వద్ద లభించిన శాసనాలలో, యీ కట్టడం చైతిక సంప్రదాయానికి చెందిన మహా చైత్యంగా పేర్కొనబడింది.

భారతదేశంలోనే బహుశా అన్నింటికంటే విస్తృతమైన, కళాత్మకమైన స్మారక చిహ్నంగా నిలిచే వెలుపలి ప్రాకారం (outer railing) మూడు మీటర్లకన్న ఎత్తైన నిలువు రాతిపలకలు మూడు దర్సగా కారపు అడ్డరాతి సూచీలతో కలపబడింది (suchi). ఈ నిలువురాతి పలకలు, సుమారు 84 సెంటీ మీటర్ల ఎత్తున చిత్రపల్లకితో కూడిన ప్రాకారపు పందురుకు ప్రాపు నిస్తుండేవి. రాతిపలకలమీద ధర్మచక్రాలు, నాగులు, కుబ్జులు మొదలైనవి, మరుగు పలకమీద పగుగులుతీస్తున్న పుష్పలావికలు, మరియు వివిధ సాంకేతిక చిత్రాల శిల్పాలు అలంకారంగా చెక్కబడ్డాయి.

లోపలి ప్రాకారం మరింత విస్తృతంగా మలచబడింది. అది 1.8 మీటర్లు ఎత్తు, 77 మీటర్ల చుట్టుకొలత కలిగిఉండేది. ఈ లోపలి ప్రాకారంలోపల పునాదివద్ద [illegible] మీటర్ల చుట్టుకొలత కలిగిన స్తూపం ఉండేది. భారతదేశంలో మరే యితర చైత్యంగాని స్తూపంగాని అంతటి శిల్పాధిక్యతను, అసమాన శ్రేష్ఠతను ప్రదర్శించి యుండలేదు. హుయాన్ త్సాంగ్ వర్ణించినట్లుగా, అది "బాక్ట్రియా స్థపాల మహోన్నత శోభనంతా ప్రదర్శించడమే కాక, దాని చుట్టూ ఉన్న దక్షమైన అవస్థలు, తళతళ మెరిసే నీలి బుగ్గల బాహుళ్యం, దానితో మనోహరమైన ఏకాంత విరామస్థలంగా [illegible]."

ప్రస్తుతం లభ్యమవుతున్న అవశేషాలు, మెకంజీ, రాబర్టు సీవెల్, బర్గెస్ వంటి తొలి పురాతత్త్వవేత్తల సర్వే నమూనాలు (survey plans) కంటె ఎక్కువ నిర్ధారితంగా, ఆయక పట్టాలు లేక స్తూపపట్టాల మీద చెక్కడాలలోని స్తూప చిత్రణ వీటి సహాయంవల్ల మాత్రమే స్తూపానికి సంబంధించిన సాధారణ నమూనా (general plan), స్తూపాలంకరణ వివరాలు తెలిసికొనగలుగుతాం. దాని ప్రాకారం మాత్రం, భారతదేశంలోని యితర ప్రాకారాలన్నిటికంటె ఎంతో మిన్నగా అలంకృతమై ఉండేది. అదృష్ట వశాత్తు దాని శిథిల భాగం ఒకటి భద్రపరచబడి ఉంది. అంచనా ప్రకారం దాని వ్యాసం 59 మీటర్లు—అనగా బార్హుట్‌లో ఉన్నదాని కంటె దాదాపు రెట్టింపు అన్నమాట.

ధనకటక మహానగరాన్ని ఒకప్పుడు అలంకరించిన అనేకమైన స్తూపాలు, విహారాలలో మిగిలిఉన్న ఒకే ఒక కట్టడం నేడు అమరావతిలో పురాతత్త్వవస్తు ప్రదర్శనశాల ప్రక్కనఉన్న మహాస్తూపం. నేటి అమరావతీ పట్టణ భూగర్భంలో ఎన్నో బౌద్ధమతావశేషాలు దాగి ఉండవచ్చు. అదే విధంగా నేటి అమరేశ్వర ఆలయంకూడా ఒక బౌద్ధ స్తూపంమీద నిర్మితమై ఉండవచ్చు. అమరేశ్వరాలయం చుట్టూ ఉన్న ఎత్తైన ప్రహరీ గోడ ఒక బౌద్ధస్తూపాన్ని పరివేష్టిస్తూ ఉండి వుండాలి. అలాగే స్తూపాన్ని అలంకరించిన శిల్ప సంపద చిన్నాభిన్నం కావించబడి యుండవచ్చు. ఆ శిల్ప ఫలకాలను అమరేశ్వరాలయంలో నందిమండపానికి, పైకప్పు పలకలుగా ఉపయోగించారు. మిగిలిన వాటిలో చాలా వాటిని ముక్కలుచేసి ఆలయంకట్టడ కందకాల్లో ఉపయోగించారు.

డాక్టర్ శివరామ మూర్తి, తదితర విద్యావేత్తలు అమరావతి శిల్పకళను మౌర్య, శాతవాహన, ఇక్ష్వాకు, వజ్రయాన అని నాలుగు దశలుగా విభజించారు. మౌర్య దశ యీ మహాస్తూపపు మూల కట్టడానికి కారణభూతమైన హీనయానానికి సమకాలీనమైనది. శాతవాహన పరిపాలనకు సమకాలీనమైన తొలి మహాయాన దశలనాటి ఎనలేని శిల్ప సంపద మరే యితర బౌద్ధ క్షేత్రంలోకూడ లభ్యం కానిది యిచ్చట మనకు లభిస్తుంది. ఇచ్చటి మహాచైత్యం మరియు తదితర స్తూపాలు శిల్ప వైభవంతో విరాజిల్లుతుండేవి.

అమరావతి శిల్పాన్ని లౌకిక శిల్పం, మతైక శిల్పం అని రెండు వర్గాలుగా విభజించవచ్చు. లౌకిక వర్గంలో స్త్రీ, పురుష మూర్తులు, ఆభరణాలు, శిరో ఉష్ణీషాలు, కంఠాభరణాలు, నడికట్టులు, శిరోజ పద్ధతులు వంటి వైనందిన సాంసారిక జీవిత పద్ధతులు చేరుతాయి. మత సంబంధమైన వర్గంలో బుద్ధుని అవశేషాల పంపకం, మహాపరిత్యాగం, మారువిదాడి, బుద్ధపూజ, గజమానవులస్తూపారాధన, బుద్ధపాదపూజ, సిద్ధార్థుని నిష్క్రమణ, మహాధర్మచక్రపరివర్తన, బోధివృక్షపూజ మొదలైన బుద్ధుని జీవితానికి, జాతక కథలకు సంబంధించిన విషయాలుంటాయి. ఇతర ప్రముఖ విషయాలు—నలగిరి లొంగుబాటు, జాతక కథలు, వాటిలో ముఖ్యంగా ఛద్దంత, విధుర పండిత, శిబిజాతక కథలు మొదలైనవి

# ఛాయ చిత్రముల వివరణ

1వ చిత్రం : అమరేశ్వరాలయం. కృష్ణానది ఒడ్డున ఉన్న ఈ అమరేశ్వర ఆలయం లోనే అమరావతి మహాచైత్యానికి సంబంధించిన అనేక క్రొత్త శిల్పాలు యిటీవలనే కనుగొనబడ్డాయి. దేవాలయ జీర్ణోద్ధరణ జరుగుతున్నప్పుడు యివి బయటపడినవి. ఈ దేవాలయపు ప్రాచీనత నికరంగా తెలియదనీ, కాని ధరణికోట తాలూకు మొదటి తూర్పు చాళుక్యుల శాసనం ఒకటీ, దాని తర్వాత కోట నాయకుడొకడు, రెడ్డి వంశజుడైన మహా మండలేశ్వర కేతిరాజు, మరియు విజయనగర సామ్రాజ్యాధిపతి కృష్ణదేవరాయలు, వీరికి సంబంధించినవి వరుసగా 12, 14, 16 శతాబ్దాలకు చెందిన యిటీవలి శాసనాలుకొన్ని అమరేశ్వరాలయంలో ఉండడం మూలాన, ప్రాచీన కాలం నుండి హిందూ దేవాలయానికి అక్కడ ఉన్న ప్రాముఖ్యం వెల్లడవుతోంది, అని సి. శివరామమూర్తిగారు వ్రాశారు.

ఆ శాసనాలు మరియు యీ రచయితలు దేవాలయ జీర్ణోద్ధరణ సందర్భంలో దేవాలయాన్ని గురించి అధ్యయనం చేయడం, జీర్ణోద్ధరణ ప్రక్రియలో భూమిలో గోతులు త్రవ్వుచున్నప్పుడు దేవాలయాధికారులు కనుగొన్న ప్రాచీన అవశేషాలు—యివి అన్నీ బహుశా దేవాలయం ప్రాచీన బౌద్ధ స్థూపాన్నొకదానిని మరుగు పరుస్తున్న ఒక మట్టిదిబ్బ మీద నిర్మితమై ఉండవచ్చునని గట్టిగా సూచిస్తున్నాయి. ఈ వూహ బలపరచే అదనపు సాక్ష్యాధారం మనకు దేవాలయ గర్భగుడిలో కని పిస్తుంది. అమరేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించిన గర్భగుడిమట్టం, భూమట్టానికి 6 మీటర్ల పైన ఉంది. అసలు శివలింగమే ఆయక స్తంభాలకు ఉపయోగించిన సున్నపురాతితో, తయారైనట్లుగా కనిపిస్తుంది. ఆ ప్రాంతంలో ఉండే బౌద్ధ స్థూపం తాలూకు ఛత్రిస్తంభం లేదా ఆయక స్తంభం ఒకటి కొన్ని శతాబ్దాల క్రితం శివలింగంగా మార్చబడిందని మా నిశ్చితాభిప్రాయం. ఆంధ్రలో అటువంటి దేవా లయాలను ఆ విధంగా హిందూ దేవాలయాలుగా మార్చే సంప్రదాయాలు సంభవమేనని నిరూపిస్తు న్నాయి. ఆ మార్పు క్రీస్తు శకంలోని తొలి శతాబ్దాలలో జరిగి ఉండాలి.

ఏదేమైనప్పటికీ అసలు ఆ దేవాలయమే ప్రాచీనమైనదని గుర్తుంచుకోవాలి. మార్పు క్రీ.శ. 6, 7 శతాబ్దాలలో, బౌద్ధమతం క్షీణదశలో ఉన్నప్పుడు జరిగి ఉండవచ్చని ఊహించినప్పటికీ ప్రాచీన దేవాలయాల్లో ఒకటైన ఈ దేవాలయానికి 13, 14 వందల సంవత్సరాలుగా పూజనీయమైన మరియు వున్నత గౌరవనీయమైన చరిత్ర ఉన్నదన్న సంగతి జ్ఞాపకం ఉంచుకోవాలి. ఆ ప్రాంతంలో అమరేశ్వరస్వామి ఎంతో పూజ్యభావంతో ఆరాధించబడుతున్నాడు.

దేవాలయ జీర్ణోద్ధరణ చరిత్ర చూసినట్లయితే గతంలో ఆ దేవాలయానికి జీర్ణోద్ధరణ చాల సార్లు గావించబడిందని బోధపడుతుంది. వెనుకటి జీర్ణోద్ధరణ అమరావతి జమీందారైన రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు ఆధ్వర్యంలో జరిగింది. అమరావతిలో స్థిరపడిన చింతపల్లి జమీందారు–

రాజావాసిరెడ్డి నాయుడు 18వ శతాబ్దపు చివరి భాగంలో అమరావతి వద్దనున్న గుండ్రటి మట్టిదిబ్బను త్రవ్వించాడని రికార్డులో కూడ నమోదై ఉంది. అక్కడ దొరికిన శిల్పాలతో కూడిన శిలాఫలకాలలో కొన్నిటిని అమరేశ్వరస్వామి ఆలయపు జీర్ణోద్ధరణకు ఉపయోగించారన్నది స్పష్టం.

2వ చిత్రం : అమరేశ్వరస్వామి ఆలయమండపంలో పైకప్పు పలకలుగా ఉపయోగించిన శిల్పాలతో కూడిన శిలాఫలకాలను చూపిస్తుంది. ఈ చిత్రంలో ఒక ఫలకం మంచి స్థితిలో ఉంది అందులో యువరాజు సిద్ధార్థుడు భార్య యశోధరను, పుత్రుడు రాహులుని కడసారిగా చూస్తున్న దృశ్యం ఉంది. మిగిలిన మూడు ఫలకాలలో బుద్ధుని, బోధి వృక్షాన్ని మొదలగు వాటిని పూజిస్తున్న దృశ్యాలు వున్నాయి. వాటిని గురించి వేరే వివరించబడింది.

3వ చిత్రం : (76 X 24) అతి ప్రముఖమైన, అద్వితీయమైన శిల్పకళను చూపించే శిలాఫలకం. దానిని అమరేశ్వరస్వామి ఆలయంనుండి తిరిగి గ్రహించడం జరిగింది. ఈ స్తూప ఫలకం మీద అపూర్వ మహాపరిత్యాగ దృశ్యం కనిపిస్తుంది. అందులో యువరాజు సిద్ధార్థుడు తన భార్యా పుత్రులను కడసారిగా అవలోకిస్తుంటాడు. శిల్పంలో యశోధర శరీరానికి సంబంధించిన కొన్ని భాగాలు తప్ప దాదాపుగా ఫలకం యావత్తు జాగ్రత్తగా భద్రపరచబడింది. అందులో సిద్ధార్థుడు, తల్లి ప్రక్కను నగ్నంగా పడుకొని నిద్రిస్తున్న తన పుత్రుని కుడి చేతిని మృదువుగా స్పృశిస్తున్న దృశ్యం కనిపిస్తుంది. యశోధర తలక్రింద కుడిచేతి నుంచుకొని, గాఢంగా నిద్రిస్తున్నట్లుగా చూపించబడింది. సిద్ధార్థుడు తలమీద కిరీటంలా అలంకరించబడిన శిరోవేష్టంతో ఒక ఉత్తమ పురుషుడుగా చూపించబడ్డాడు. ఈ మూర్తికి, స్తూప ఫలకం మీదనున్న మరొక పురుష మూర్తికీ మధ్యగల తేడా గుర్తించ తగినది. రెండవ పురుషుని మూర్తి రథచోదకుడు చెన్న నిదిగా గుర్తించబడింది. అతడు కాగడా పట్టుకొని ఉంటాడు. రాత్రి సమయాన్ని సూచించడానికి గాను రథచోదకుడు చెన్నని చేతిలో కాగడా ద్వారా ఆంధ్ర శిల్పి సరళమైన దేశీయ మేధా సంపత్తితో దృశ్యచిత్రణలో సమయ సమన్వను ఎంతో చక్కగా పరిష్కరించాడు.

గుంటూరు జిల్లాలోని స్థానిక నిపుణులు యీ శిల్పాన్ని బుద్ధ జన్మకు సంబంధించినదిగా పొరపాటున భావిస్తున్నారు ఇది స్పష్టంగా తప్పు అభిప్రాయం. బుద్ధుడు లుంబినీవనంలో పుట్టాడు కాని రాజప్రాసాదంలోకాదు.

"సాలుంబినీ నామ వనాంత భూమిమ్
చిత్ర ద్రుమమ్ చైత్ర రథాభిరామమ్"

అశ్వఘోషుని సుప్రసిద్ధ బుద్ధచరిత మరియు దాని చీనీ భాషా అనువాదం, మా—మెంగ్ పూ—సా రచించిన, ఫో—షో-హింగ్‌త్సాన్—కింగ్ పుస్తకంలో పసిబిడ్డడైన బుద్ధుడు పుట్టుక సమయంలో శుభసూచనల మధ్య ఏడడుగులు వేసినట్లుగా వర్ణించబడింది.

దీప్త్యాచ ధైర్యేణ చ యో రరాజా
బాలో రవిర్భూమిమివావ అతీర్ణః

తథాపి దీప్త్యాపి నిరీక్షమాణో
జహారా చక్షుంషి యథా శశాంకః

తన దీప్తి మరియు దృఢత్వంతో అతడు (బుద్ధుడు) భూమికి అవతరించిన బాలార్కుని వలె కనిపించాడు మిరిమిట్లు గొలిపే కాంతిలో కూడ తనను అవలోకించిన అన్ని కళ్ళనీ అతడు శశాంకునివలె చల్లగా ఆకట్టుకొన్నాడు.

అనాకులాకుబ్జ సముద్గతాని
నిష్పేష వన్వ్యాయతా విక్రమాణి
తాథైవ ధీరాణి పదాని సప్త
సప్తర్షి తారా న దృశో జగామ !

సప్తర్షి తారామండలం వలె ప్రకాశిస్తున్న, అతడు పాదాలను తిన్నగాను దృఢంగాను ఎత్తి స్థిరమైన పెద్ద పెద్ద అంగలతో ఏడడుగులు వేశాడు

బోధాయ జాతోస్మి జగద్ధితార్థా
మన్త్యా భవోత్పత్తి రియమ్ మమేతి
చతుర్దిశమ్ సింహగతిర్గిరి విలోక్య
వాణీమ్చ భవ్యార్థ కరీమువాచ !

సింహంవలె నలుదిక్కులు చూసి అతడు (బుద్ధుడు) శత్వార్థాన్ని తెలియజేస్తూఅన్నాడు: "లోక కళ్యాణార్ధమై ఉపదేశం యివ్వడం కొరకు నేను పుట్టాను. ఈ దృశ్యమానవ ప్రపంచంలో యిదే చివరిజన్మ."

ప్రసిద్ధ బ్రాహ్మణ పరివ్రాజకుడు, జ్యోతిష్యుడు అయిన అసితుడు బుద్ధుని అరికాళ్లలో వేయి కిరణాల చక్రం, అతనికాలి వేళ్ళు, బొటన వ్రేలిమధ్య సాలిగూడు వంటి అతి సన్నని రేఖలు అతని మర్మాంగాలు గుర్రపు వాటివలె కప్పబడి ఉండడం, అతని శరీరఛాయ తేటగాను ప్రకాశవంతంగాను ఉండడం - యీ లక్షణాలను గమనిస్తాడు. ఈ అద్భుత లక్షణాలను చూసి అతడు బుద్ధుడు పుట్టాడని చాటుతాడు. ఈ లక్షణాలు యీ శిల్పంలో కానరాకపోయినా అది స్పష్టంగా సిద్ధార్థ రాకుమారుడు తన భార్యా పుత్రులను వారు నిద్రిస్తుండగా కడసారిచూస్తున్న దృశ్యమే.

వాస్తవానికి అశ్వఘోషుని బుద్ధచరితలో రాకుమారుడు కడసారిగా తన పత్నీ సుతులను చూసినట్లుగా వర్ణన ఏదిలేదు. ఒక ముసలి వానిని, ఒక రోగిని, ఒక మృత దేహాన్ని చూసిన, రాకుమారునిలో కలిగిన మానసిక క్షోభ, రథసారథి చెన్నడు రాకుమారుని రథాన్ని పద్మసంద తోటకు నికి మళ్లించటం, అక్కడి స్త్రీలు, పురోహితుని కుమారుడైన ఉదయనుడు, సిద్ధార్థుని ఐహిక సుఖా

తథాతి దీప్తోపి ని రీక్షమాణో
జహారా చక్షుంషి యధా శశాంకః

తన దీప్తి మరియు దృఢత్వంతో అతడు (బుద్ధుడు) భూమికి అవతరించిన బాలార్కుని వలె కనిపించాడు. మిరిమిట్లు గొలిపే కాంతిలో కూడ తనను అవలోకించిన అన్ని కళ్ళనీ అతడు శశాంకునివలె చల్లగా ఆకట్టుకొన్నాడు.

అనాకులాకుబ్జ సముద్గతాని
నిష్పేష వన్వ్యాయతా విక్రమాణి
తాథైవ ధీరాణి పదాని సప్త
సప్తర్షి తారా స దృశో జగామ !

సప్తర్షి తారామండలం వలె ప్రకాశిస్తున్న, అతడు పాదాలను తిన్నగాను దృఢంగాను ఎత్తి స్థిరమైన పెద్ద పెద్ద అంగలతో ఏడడుగులు వేశాడు

భోధాయ జాతోస్మి జగద్ధితార్థా
మన్త్యా భవోత్ప త్తి రియమ్ మమేతి
చతుర్దిశమ్ సింహగతిర్రి విలోక్య
వాణీమ్చ భవ్యార్థ కరీమువాచ !

సింహంవలె నలుదిక్కులు చూసి అతడు (బుద్ధుడు) శతాబ్దార్థాన్ని తెలియజేస్తూఅన్నాడు "లోక కళ్యాణార్థమై ఉపదేశం యివ్వడం కొరకు నేను పుట్టాను. ఈ దృశ్యమానవ ప్రపంచంలో యిదే చివరిజన్మ."

ప్రసిద్ధ బ్రాహ్మణ పరివ్రాజకుడు, జ్యోతిష్యుడు అయిన అసితుడు బుద్ధుని అరికాళ్లలో వేయి కిరణాల చక్రం, అతనికాలి వ్రేళ్ళు, బొటన వ్రేలిమధ్య సాలిగూడు వంటి అతి సన్నని రేఖలు, అతని మర్మాంగాలు గుర్రపు వాటివలె కప్పబడి ఉండడం, అతని శరీరఛాయ తేటగాను ప్రకాశవంతంగాను ఉండడం - యీ లక్షణాలను గమనిస్తాడు. ఈ అద్భుత లక్షణాలను చూసి అతడు బుద్ధుడు పుట్టాడని చాటుతాడు. ఈ లక్షణాలు యీ శిల్పంలో కానరాకపోయినా అది స్పష్టంగా సిద్ధార్థ రాకుమారుడు తన భార్యా పుత్రులను వారు నిద్రిస్తుండగా కడసారిచూస్తున్న దృశ్యమే.

వాస్తవానికి అశ్వఘోషుని బుద్ధచరితలో రాకుమారుడు కడసారిగా తన పత్నీ సుతులను చూసినట్లుగా వర్ణన ఏదిలేదు. ఒక ముసలి వానిని, ఒక రోగిని, ఒక మృత దేహాన్ని చూసిన, రాకుమారునిలో కలిగిన మానసిక క్షోభ, రథసారథి చెన్నడు రాకుమారుని రథాన్ని పద్మనంద తోటలోనికి మళ్లించటం, అక్కడి స్త్రీలు, పురోహితుని కుమారుడైన ఉదయనుడు, సిద్ధార్థుని ఐహిక సుఖా

అనుభవించవలసినదని ప్రలోభపెట్టడం, కాని రాకుమారుడు స్థిరచిత్తుడై ఉండడం, తన గుర్రం కంటకంపై ఎక్కి అడవిలోనికి వెళ్ళడం అక్కడొక శ్రమణుని కలిసి తన ధర్మాన్ని గుర్తించిన వాడై ఇల్లువిడిచి పోవాలని నిర్ణయించుకొనడం, ఒకనాటి సాయంత్రం అతడు వస్త్రాలు పొదిగిన తన సువర్ణ శయ్యవద్దకువెళ్ళడం,అక్కడొకఉత్తమోత్తమాంగన–బహుశా అతని భార్య యశోధర కావచ్చు–అతని కొరకు ఎదురు చుస్తూ ఉండడం, గృహ పరిత్యాగం చేయాలనే బలీయమైన కోర్కె వలన అతడు వాటిలో ఆనందం పొందలేకపోవడం, అకమస దేవతలు అంతఃపురాంగనలు నిద్రలో వికృతంగా వారి అవయవ ప్రదర్శన చేయడం చూపబడింది. వారిలో ఒక అంగన కపోలాన్ని చేతిపై ఆన్చి నిద్రిస్తుండడం, వేరొక ఆమె యొక్క తెల్లని వస్త్రం ఆమె వక్షోజాల మీద నుండి ప్రక్కకు జారడం అలాగేచాలమంది స్త్రీలు వారి సహజసభ్యతా సౌందర్యాలు కుటుపడేట్టు అసభ్య రీతులలో లజ్జా విహీనలై మైమరచి నిద్రింస్తుండటం చూస్తాం. అపుడు రాకుమారుడు రాజప్రాసాదం విడిచి మొదటి ప్రాంగణంలోనికి వెళ్ళడం, అక్కడ అశ్వపాలకుడైన చండకుని (చన్నడు, చన్నకుడు) లేపి, తనగుర్రం కంటకాన్ని తీసుకోని రమ్మనమని చెప్పడం, వారపుడు నగరం విడిచి వెళ్ళడం, గుర్రం, రౌతు నిశ్శబ్దంగా నగరం దాటి వెళ్ళేందుకు చప్పుడు కాకుండుగా యక్షులు తమ దేహాలను వంచి గుర్రపు డెక్కలను ఎత్తి పట్టుకొనడం, యివీ ఆపుస్తకంలో వర్ణితమైన విషయాలు.

ఆంధ్రశిల్పి, తన అపారమైన కల్పనా చాతుర్యం, శక్తి ఉపయోగించి అప్పటికి అది జనామోదం పొంది వ్యవహారంలో ఉన్న బుద్ధ మహా కళకు కరుణను, లాలిత్యాన్ని జోడించి రాకుమారుడు చివరి సారిగా భార్యను, కన్నకుమారుని చూస్తున్నట్లుగాను, రాత్రి సమయాన్ని తెలియజేస్తూ, చెన్నడు చేతిలో కాగడాతో నిల్చున్నట్లుగాను, రాతిమీద ఒక చక్కని దృశ్యాన్ని చిత్రంగా చెక్కాడు.

ఫలకం మీద పైభాగం కూడ అనుగుణమైన భాగంగా భావించే పక్షంలో అందులోని శిల్పం అంజలిహస్త భంగిమలో నున్న రెండు దివ్యాత్మలను తెలియజేస్తున్నదని అర్థం చెప్పుకోవాలి. కాని విషయం స్పష్టంగా అదికాదు. వివరంగా పరిశీలించినట్లయితే ఖండితమైన పైభాగం, ఆరాధనా దృశ్యాన్ని చూపిస్తున్న వేరొక పంజిక (register) అని బోధపడుతుంది. అంజలి హస్తులై కూర్చుని ఉన్న భక్తులిద్దరి శిరోవేష్టనాలు, వారి చేతులకు చెవులకు ఉన్న అనేకమైన ఆభరణాలు-వీటివలన అంజలిహస్తులై ఉన్న వీరు యిద్దరు కులీనులని స్పష్టమవుతుంది ఈ మూర్తులను క్రింది పంజికలోని రథచోదకుడు చన్నడు, రాజకుమారుడు సిద్ధార్థుల మూర్తులతో పోల్చి చూసినట్లయితే, చన్ననికి ఆభరణాలు ఏమీలేవనీ, అలానీ మహా పరిత్యాగ దశలోనున్న సిద్ధార్థునికి తలపై కిరీటం వంటి శిరోవేష్టం, కర్ణా భరణాలు మాత్రమే ఉన్నాయనీ బోధపడుతుంది. ఇందుకు భిన్నంగా పై పంజికలోని కులీనుల చేతుల, చెవుల ఆభరణాలు సంఘంలో వారికిగల ఉన్నత స్థితిని తెలియ చేస్తున్న యీ శిల్పం, ఆనాటి పురుషులు, ముఖ్యంగా కులీన పురుషులు

చేతులకు, చెవులకూ ఆభరణాలు ధరించే వారని తెలియజేస్తుంది. పురుష హస్తాలమీద ఆభరణా మూడు పట్టీలు లేక పేటలు కలవి రాకుమారి యశోధర లావుపాటి ఒంటి పేటగొలుసు, బహు ముత్యాలది కావచ్చు—ధరించి వుంది. ఆమె చేతికి రత్నాలు పొదిగిన చుట్టు గాజులున్నాయి స్త్రీ పురుషమూర్తులన్నీ కూడ గుండ్రని కుండలాలు ధరించి ఉంటాయి. అగ్ర పంజికలో విరిగిన రెం మూర్తుల ఖండాలున్నాయి వాటిలో ఒక ఖండం స్పష్టంగా పురుషమూర్తిది. రెండవది స్త్రీ ప షుల్లో యెవరిదైనా కావచ్చు. మధ్యభాగాన ఉన్న వృత్తాకారం ఖండిత బోధివృక్షమూలం అని ని క్షేపణీయంగా ఊహించుకోవచ్చు

సిద్ధార్థుడు చివరిసారిగా తన భార్యను, పుత్రుని ఆర్ద్రంగా అవలోకిస్తున్న పూర్వప పరిత్యాగ దృశ్యాన్ని రాతిపైన మనోహర శిల్పంగా మలచే కళలో, శిల్పి పరిపూర్ణత్వాన్ని పొం దని భావించవచ్చు. ఆ దృశ్యాన్ని శిల్పంగా రూపొందించి స్థలానికి, కాలానికి సంబంధించిన శి సమస్యను పరిష్కరించి గత శతాబ్దాలకు చెందిన ఆంధ్ర శిల్పి ఎంతో నైపుణ్యం సాధించా స్తూపాలు, అలంకారిక ఫలకాలు కూడ గమనించతగినవి. మొత్తం శిల్పం అంతా సిద్ధార్థ రాకు రుడు మహా పరిత్యాగ మార్గంలో అడుగిడబోతున్న తరుణంలో వుత్పన్నమైన కోమల భావం ఒ వైపు, గంభీరమైన విషాద భావం మరొక వైపు కలుగ జేయడంలో విజయాన్ని సాధించిం తల్లియొక్క నిర్విచారమైన నిష్కపటమైన నిద్ర, మరియు రథచోదకుడు చెన్నని ముఖంల శోకభావం—యీ రెండూ కూడ గమనించతగినవే. సిద్ధార్థ రాకుమారుడు భావాతీతమైన భావం వుంటాడు. అచేతనంగానో, అపచేతనంగానో, తన బిడ్డ చేతిని స్పృశిస్తున్నపుడు కూడ అ మూర్తిలో భావి బుద్ధుని ప్రశాంతత, సమచిత్తత మనకు గోచరిస్తాయి. శిల్పకళకు తలమానిక : దగిన యీ శ్రేష్ఠ కృతి అమరావతీ శిల్పకళయొక్క పరిపక్వదశలోనిదై యుండవచ్చు. క్రీ.శ. 100-150 మధ్య కాలానికి చెందినదై వుండవచ్చు.

4వ చిత్రం : రెండు పంజికలున్నాయి. పైపంజిక బోధివృక్షారాధనను సూచిస్తుం ఒక సింహాసనం పైన మధ్యగా ఒక వృత్తాకారం, సింహాసనం క్రింద బుద్ధపాదుకలు, చూపి బడ్డాయి. మధ్యనున్న వృత్తాకారంలో బుద్ధుడు కూర్చొని తన ప్రథమ ధర్మోపదేశాన్ని యిస్తుండ స్పష్టంగా కానవస్తుంది. వృక్ష చైత్యానికి కుడివైపున ఒకడు వింజామర వీస్తున్నాడు. బోధి వృ నికి ఎడమవైపున కూర్చుని ఉన్న పురుషమూర్తి విరిగిపోయింది. రెండు పంజికలు మధ్యను పుష్ప పట్టిక (flower motif) కూడ చూడతగినది. క్రింది పంజిక తిరిగి రెండు పంజికల ఉండడం గమనించతగినది. అడుగు పంజికలో యిద్దరు పురుషులున్నారు. మొదటి వాడు చిన్న గొడుగు వుచ్చుకుని చిత్రంలో కనిపించని బుద్ధ మూర్తిని కాని, బుద్ధ చిహ్నాన్ని కాని స్ప గా సేవిస్తున్న కులీనుడు. వీనికంటె పొడగరి అయిన కులీనుడు వినమ్రుడై, స్వాభావిక అంజలి హస్తభంగిమలో ఉన్నాడు. వారి చేతులకు, కంఠాలకు, చెవులకు, ఉన్న ఆభరణా సొగసైన శిరోవేష్టాలు గమనించతగినవి. ఆ మూర్తులు, నడుముకు పై భాగంలో ఆచ్ఛా లేకుండగా, నడుముకు క్రింది భాగంలో దుస్తులు ధరించినట్లుగాను ఉన్నాయి. అమరావతీ శి లోని పురుషమూర్తులలో కానవచ్చే విశిష్ట లక్షణం ఏమంటే వారి మర్మాంగాలను "గచ్ఛాలు

లుంగచుట్టుగా ఉన్న దుస్తులు ధరింపజేసి సూచించడం. ఇందులో ఖండితమైన నగ్నస్త్రీ శిలామూర్తి ఒకటి ప్రత్యేకంగా ఉంది. దానిని గురించి వేరే వివరంగా వర్ణించబడింది. ఆ మూర్తిలో వక్ష స్థానం ప్రముఖంగాను, స్పష్టంగాను కనిపిస్తుంది. అమరావతిలోని స్త్రీ, పురుష మూర్తులను పరిశీలిస్తే, ఒక విషయం బోధపడుతుంది. అమరావతి శిల్పి, మానవ శారీరక శాస్త్రంలో నిష్ణాతుడే కాక శిల్పియొక్క నైపుణికి, భావనకు, కళకు శాస్త్రీయ హద్దులేర్పరుస్తూ, అమలులోనికి వచ్చిన ఆగమాలవంటి వాటి నియమ నిబంధనలవలన కానీ, ఆంక్షల వలన కానీ, ఋక్తంక మర్యాద అంటూ వచ్చిన మతాచార ఛాందస భావాల ప్రభావాలకు కట్టుబడకుండగా నిరాడంబరంగా సంపూర్ణ స్వేచ్ఛతో స్త్రీ, పురుష జీవరాసులను శిలల మీద మలిచేవాడు. ఈ పంజికలోని పై భాగాన, దోసిలిలో గుర్తు తెలియని వస్తువేదో సమర్పిస్తున్న శిరోవేష్టధారియైన ఒక యక్షునో లేక గంధర్వునినో చూడవచ్చు.

5వ చిత్రం : రెండు పంజికలున్నాయి. రెంటిలో కూడ శిల్పాలు, ఖండాలుగా నుండి చాల వరకు పాడైపోయి ఉన్నాయి. పై పంజికలో బుద్ధుని సింహాసనం, దాని క్రింద బుద్ధ పాదాలు, ఒక చిన్న ధర్మ చక్రం, దాని మీద శ్రీవత్స చిహ్నం వున్నాయి. అగ్రభాగం పోయింది అందులో చక్రం ఉండి ఉండవచ్చు. ఈ పంజికలో యిద్దరు భక్తుల మూర్తులు ఉండడంవలన, యిది ముఖ్యంగా ధర్మ చక్ర ప్రవర్తనకు సంబంధించిన దృశ్యమై ఉండవచ్చు. క్రింద పంజికలో ధర్మచక్రం అగ్రంలోగల స్తంభం కానవస్తుంది. ఈ శిల్పంలోని యితర మూర్తులు గుర్తుబట్ట డానికి వీలుకానంతగా పాడైపోయి ఉన్నాయి. యితర స్తంభాలలోవలె పై నున్నట్టే గుర్రాల మీద రౌతుల మూర్తులు దీనిపైన కూడ ఉండి ఉండవచ్చు.

6వ చిత్రం : నన్నని పుష్ప పట్టికలచేత విభజింపబడిన మూడు పంజికలున్నాయి. మధ్య పంజికలో అంజలిహస్తులైన ముగ్గురు కులీన పురుషులున్నారు. అది బుద్ధారాధన దృశ్యమై ఉంటుంది. చేతి కంకణాలు, చెవుల మకరకుండలాలు, ఉడుపులు మర్మాంగాలను కప్పుతూ ఉన్న 'గుచ్ఛ' వంటి వస్త్రధారణ చూడతగినవి. ఎడమపైపున ధారాళంగా వ్రేలాడుచున్న పొడవాటి నడుముపట్టీ కూడ గమనించతగినది. శిరోవేష్టనాలు, వారి ఉన్నత సాంఘిక స్థితిని తెలియజేస్తున్నాయి. ప్రధానమైన మూర్తి రత్న ఖచితమైన శిరోవేష్టం కలిగి ఉంది. దీనికి అగ్రభాగాన, పూల మూర్తులతో నున్న నన్నని పుష్ప పట్టిక ఉంది దాని పైభాగాన ఉన్న పంజికలో ఒక పౌరాణిక జంతువు — సంభమత, రెక్కల గుర్రం ఉంది. క్రింది పంజిక, బుద్ధ సింహాసన భాగాన్ని, యిద్దరు భద్రపురుషులను చూపిస్తుంది. ఒక భక్తుని శిరస్సు, సింహాసనానికి దగ్గరగా స్థానభ్రంశం చెంది క్రింద ఉంది.

7వ చిత్రం ; ఇది 50 సెం.మీ. వెడల్పు, 106 సెం.మీ. ఎత్తు ఉన్న ఒక పెద్ద శిలాఫలకం. ఇక్కడకూడ రథచోదకుని వంటి మూర్తుల ముఖాలు పూర్తిగా పాడైపోయి ఉన్నాయి. స్పష్టంగా రెండు పంజికలున్న యీ శిల్పంలో కపిలవస్తు నగరంలోని లౌకిక దృశ్యాలు మలచబడ్డాయి. అగ్రభాగంలో ఉన్న దాంట్లో, ఒక యువ రాకుమారిని తీసికొని వెళ్లుచున్న పల్లకి కనిపిస్తుంది. క్రింది పంజికలో కనిపించే రెండు గుఱ్ఱాలు సిద్ధార్థ రాకుమారుడు, రథచోదకుడు చన్నునివై యుండుట మూలాన పై పల్లకిలోని స్త్రీ సిద్ధార్థుని భార్య యశోధర అని గుర్తించడానికి వీలుకలుగుతోంది. సిద్ధార్థుడి తల్లి మాయాదేవి బుద్ధుడు జన్మించిన ఏడు రోజులకే చనిపోవడంతో ఆ పల్లకిలో స్త్రీ యశోధర అనే నిస్సంశయంగా చెప్పవచ్చు. పల్లకి గొడుగునొకదానిని-రాజ ఛత్రం చూపిస్తున్నందువలన పల్లకిలోని మూర్తి సిద్ధర్థుని భార్య యశోధరా దేవి అని భావించబడింది. పైపంజికలోని పూల గుర్తులుగల శిలా పట్టికలు చూడవచ్చు. దానిపైన పౌరాణిక జంతువు. దానిపైన "బాన్" చెక్కడాలు స్వల్పంగా పైకి తేలినవి చూడవచ్చు. శిల్పానికి బాగా ఎడమ కొసను ఒక పౌరాణిక జంతువు (సింహం), బాగా చెడిపోయిన మరిరెండు మూర్తులు ఉన్నాయి .

క్రింది పంజిక శిథిలంగా వుంది. దీన్లో రథ దృశ్యాన్ని చూడవచ్చు. ఇందులో రథ చోదకుడు చెన్నడి మూర్తి పాడై పోయి ఉంది. శిల్పం విరిగి పాడై ఉన్నప్పటికీ సిద్ధార్థ రాకుమారుని మూర్తిని కూడ పంజికలో చూడవచ్చు. మరొక మూర్తి తాలూకు చక్రభాగం కూడ శిల్పానికి ఎడమ కొసను చెడిపోయి కనిపిస్తుంది. గుర్రపు కాళ్లను, పరుగు తీస్తున్న భంగిమలోచూపించిన శిల్పకారుని సునిశిత మేధస్సు తప్పక గమనించతగినది.

8వ చిత్రం : రెండు పంజికలతో కూడిన శిథిల శిల్పాన్నొకదానిని చూపిస్తుంది. పై పంజికలో ఐదు మూర్తులు ఉండి ఉండాలని స్పష్టపడుతోంది. వాటిలో క్రింది రెండు మూర్తులు శిథిలమైనై. వాటిలో అట్టడుగు మూర్తి ఒక యక్షునిదై ఉండవచ్చు. ఆ మూర్తికి కుడివైపున వున్న మరొక చెడిపోయిన మూర్తిని రూఢిగా గుర్తించలేము, అగ్రభాగాన హోమం చేస్తున్నట్లుగా సుఖాననంలో కూర్చున్న పురుషమూర్తి ఒకటి కొంతభాగం విరిగిపోయి ఉంది వస్త్రధారణ చేసినా వక్షోజాలు ఘనంగా మలిచి శుక్రస్థానాలను చూపిస్తున్న రెండు స్త్రీ మూర్తుల గమనించతగినవి. ఈవి బంధం కూడ చూడవలసిందే. ముందున్న స్త్రీ మూర్తి అంజలి హస్తయై చేతులకు అనేకమైన గాజులు, కాళ్లకు అనేకమైద కడియాలు ధరించి ఉండడం ఆసక్తికరంగా వుంటుంది. ఆ శిల్పం ఏదో జాతక కథను వర్ణించి యుండవచ్చు, పంజికను పూర్తిగా, నిర్ధారణగా ఇది అని చెప్పలేము. పాడైన మూర్తులు యక్ష మూర్తులు. క్రింది ప్రధానమూర్తి రుద్రయక్షుడు అయి నట్లయితే, ఆదృశ్యం 'ఆయకూట' జాతక కథవర్ణన అయిఉండవచ్చు. కాశీని పరిపాలిస్తున్న బ్రహ్మ దత్తుని పట్టపు రాణికి కుమారుడుగా పుట్టిన భోధిసత్వుడు జంతుబలిని నిషేధించాడు. అది యక్షులకు కోపకారణమై, క్షుద్ర యక్షుడొకడు భోధిసత్త్వుని చావుదెబ్బ కొట్టాలని ఎర్రగా కాల్చిన ఇనప.

కఠ్ణీనొకదానిని తీసికొని బయలుదేరుతాడు. ఇతర శిల్పాలతో పోల్చి చూస్తే యీ శిల్పం క్రీ. శ. రెండవ శతాబ్దానికి చెందినదని భావించవచ్చు.

క్రింది పంజికలో గాలిలో ఎగురుతున్న భంగిమలో ఒక మూర్తి వుంది. అతడొక ప్రస్ఫుటమైన శిరోవేష్టం, చేతులకు మూడు కంకణాలను ధరించి ఉన్నాడు. ఈ మూర్తి దేవతలలో ఒకరు— బహుశా గంధర్వునిదై ఉండవచ్చు.

9 వ చిత్రం : బుద్ధ జీవితపు దృశ్యాలను చూపించే ఒక అద్వితీయమైన మదురుశిల. ఈ శిల్పఖండం పాడైపోయినప్పటికీ, సిద్ధార్థకుమారుని మహాపరిత్యాగ దృశ్యాన్ని చూపిస్తుంది. సిద్ధార్థ రాకుమారుని గుర్రం కంటకం కుడి చివర చూపబడింది. గుర్రం, రౌతు, సిద్ధార్థ రాకుమారుడు నిశ్శబ్దంగా నగరాన్ని విడిచివెళ్ళడానికి అనువుగా నుండేందుకుగాను గుర్రపు డెక్కలను దివ్యులు ఎత్తి పట్టుకున్నట్లుగా చూపబడింది.

అశ్వఘోషుడు (క్రీ. శ. 100 రమారమి) తన బుద్ధ చరిత్రలో యీ దృశ్యాన్ని యీ విధంగా వర్ణించాడు. మహాపరిత్యాగ సమయంలో బుద్ధుడు కంటకాన్ని కౌగిలించుకుని, ప్రేమతో మెల్లగా తట్టి యిలా సంబోధిస్తాడు—

బహుశః కిల శాత్రవో నిరరస్తాః సమరేత్వామ ధిరూహ్య పార్థివేన
అహమప్యమృతమ్ పదం యాథావత్ తురగశ్రేష్ట లభేయ తత్కురుష్వ !

ఎన్నో మారులు పృధ్వీపతి నిన్నధిరోహించి యుద్ధాలలో శత్రువులను నిర్జించాడు. అదే విధంగా ఓ తురగ శ్రేష్ఠమా ! నాకుకూడ అమృత పదవిని లభింపజేయుము—

సులభాః ఖలు సంయుగే సహాయా విషయావాప్త సుఖే ధనార్జనే వా
పురుషశ్య తు దుర్లభాః సహాయాః పతి తశ్యాపది ధర్మ సంశ్రయేవా !

యుద్ధాలకు, యింద్రియ సుఖాలకు, ధనార్జనకు, చెలికాండ్రను సంపాదించడం సులభమే కాని, కష్టాలలో పడినపుడు, ధర్మాన్ని ఆశ్రయించి నపుడు, మానవులకు సహచరులు లభించడం కష్టం.

ఇహ చైవ భవన్తి యే సహాయాః కలుషే కర్మణి ధర్మ సంశ్రయే వా
అవగచ్ఛతి యే యథాంతరాత్మ నియతం తే అపి జానాస్తదంశభాజః !

పైగా యీ ప్రపంచంలో సహచరులుగా ఉండే వారి విషయంలో— అపవిత్రతను ఆపాదించే పనులలో కాని, ధర్మబద్ధ కార్యంలోకాని, వారుకూడ, నా అంతరాత్మకు తెలిసి నంతవరకు, వాటి ఫలితాంశాన్ని పొందుతారు.

తదిదం పరిగమ్య ధర్మయుక్తం మమ నిర్యాణమితో జగద్ధితాయ
తురగోత్తమ వేగ విక్రమాభ్యామ్ ప్రయతస్వాత్మహితే జగద్ధితే చ !

"ఓ తురగోత్తమా ! లోకకళ్యాణం కొరకు, ధర్మాన్ని ఆశ్రయించడానికీ, నీకు, ప్రపంచానికి మేలు చేకూర్చే విషయంలో త్వరితగతిని ధైర్యంగా కృషిచేయడానికి ఉద్దేశించిన, యీ గమనాన్ని అర్థంచేసికో."

ఇతి శుహృదమివానుశిష్య కృత్యే తురగవరమ్ నృవరో వనమ్ ఇయాసుః
సితమసి తగతి ద్యుతి ర్వపుష్మాన్. రవిరివ శారద మభ్ర మారు రోహ !

ఈ విధంగా సుందరాకారుడు అగ్నితేజుడు అయిన వరశ్రేష్ఠుడు తురగరాజమైన ఆశ్వేతాశ్వానికి స్నేహితునివలే కర్తవ్యబోధచేసి అగ్నివలె ప్రకాశిస్తున్న సూర్యుడు శరన్మేఘాన్ని అధిరోహించి నట్లుగా అరణ్యగమనం కొరకు దానిని (శ్వేతాశ్వాన్ని) అధిరోహించాడు.

అథ స పరిహరన్నిసీథ చణ్డమ్ పరిజనబోధకరం ధ్వనిమ్ సదశ్వః
విగతహనురవః ప్రశాంత హ్లేషశ్చకిత విముక్త పదక్రమో జగామ !

అటుపిమ్మట ఆ భద్రాశ్వం రాత్రిపూట భయోత్పాతం కలిగించేటటువంటి కాని, పరిజనాలను మేల్కొల్పేటువంటిగాని, శబ్దాన్నంతటిని అణచివేసి దవడలను శబ్దరహితం చేసి సకలింపును శమింపజేసి స్థిరమైన అడుగులు వేస్తూ బయలుదేరింది.

కనక వలయ భూషిత ప్రకోష్ఠైః కమలనిభైః కమలానివ ప్రవిధ్య
అవనత తనవస్తతో అస్యయక్ష శ్చకిత గతై ర్దధిరె ఖురాన్ కరాగ్రైః !

అపుడు యక్షులు తమశరీరాలను క్రిందకు వంచి తమచేతి చివర్లన దాని డెక్కలను ఆనందపరవశులై భూమి నుండి పైకిఎత్తి పట్టుకొన్నారు. వారి ముంజేతులు స్వర్ణకంకణాలతో అలంకృతమై ఉన్నాయి. వారి చేతులు తామరపువ్వులవలె ఉన్నాయి. అందుచేత దాని క్రిందే తామరపువ్వులను విసరుతున్నట్లుగా ఉంది,

శిల్పం మధ్యభాగంలో తలలులేని మిధునాల జంటవుంది. అటువైపు దాని కిరువైపుల గుండ్రని కమలాల పట్టికలున్నై. ఎడమవైపున మరొక అద్వితీయ శిల్పం ఉంది. అందులో సిద్ధార్థ రాకుమారుని కంటకాశ్వం తన ప్రభువు యెడబాటుకు దుఃఖిస్తున్న దృశ్యం ఉంది. బుద్ధుని సింహాసనం ముందు అది దుఃఖంతో మోకరిల్లుతోంది. సింహాసనంమీద బుద్ధుని శిరోవేష్టనం (లేక అతని ఉడుపులు కావచ్చు) ఉన్నాయి. ధోవతి ధరించి, ఎడమచేతిలో వంపుతిరిగిన అధికారదండంతో ముఖంలేని మూర్తి ఒకటి కంటకాశ్వం తలకు పైన ఉన్న పురుషమూర్తి స్పష్టంగా చెన్నడిది. సింహాసనం ముందు బుద్ధ పాదాలుంచే పాదపీఠాన్ని చూడవచ్చు. బుద్ధ కథలో తన యజమాని వెళ్ళిపోవడంవల్ల కంటకాశ్వం దుఃఖించడం హృదయాన్ని కదిలించే సన్నివేశం. ఆ దృశ్యమే యిక్కడ యీ మదురు శిలపై మలచబడింది. మహాపరిత్యాగం తర్వాత సిద్ధార్థ రాకుమారుడు రాత్రి పూట తన గుర్రం కంటకం మీద వేగంగా వెళ్లిపోతాడు. ఉదయానికి అతడు భృగు ఆశ్రమానికి చేరుకొంటాడు. అక్కడ గుర్రం నుండి దిగి, కంటకాన్ని చేతితో తట్టుతూ "నీ విధి పూర్తి అయింది" అని అంటాడు. తర్వాత తన శిరోవేష్టనంలో ప్రకాశిస్తున్న శిరోమణిని తీసి చెన్నని కిస్తూ దానిని, తన సందేశాన్ని తన రాజపితకు అందజేయవలసినదిగా అర్థిస్తూ చెన్నడికి సెలవిస్తాడు. దుఃఖంతో ఉన్న కంటకాశ్వంతో ఇలా అంటాడు.

ముఞ్చ కంథక మా బాష్పం దర్శితేయం సదశ్వతా
మృష్యతాం సఫలః శీఘ్రం శ్రమఃస్తేఽ యం భవిష్యతి।

ఓ కంటకమా! కన్నీరుకార్చకు. ఉత్తమాశ్వలక్షణాలను నీవు కనబర్చావు, ఓర్పు వహించు. నీ యీ శ్రమ త్వరలోనే ఫలిస్తుంది. సిద్ధార్థ రాజకుమారుడపుడు చెన్నకుని చేతిలో నుండి రత్న ఖచితమైన పిడిగల తన వాడికత్తిని తీసికొని అలంకరించబడి ఉన్న తన శిరోవేష్టనాన్ని (లోపలి జుట్టుతోసహా) కోసి దానితో వ్రేలాడుచున్న దుకూలంతో గాలిలోనికి ఎగురవేస్తాడు. దివ్యులు దానిని పట్టుకొని భావి ఆరాధనకొరకు భద్రపరుస్తారు. రాకుమారుడంత, సన్యాసి దుస్తులు ధరించి తపస్సు ప్రారంభించడానికి వెళ్లిపోతాడు. అశ్వపాలకుడు (చెన్నడు) గుర్రాన్ని చేతులలోనికి తీసికొని దుఃఖిస్తాడు. దుఃఖంతో వారు తమ రాకుమారునితో ఒక రాత్రిలో ప్రయాణించిన దూరాన్ని తిరిగి వచ్చేటప్పుడు ఎనిమిది రోజులు ప్రయాణించి నగరానికి తిరిగి వస్తారు. కంటకం కళ్ళలో నీళ్ళు! వ్రేలబడిపోతున్న అశ్వపాలకుడు, గుర్రం, కపిలవస్తు నగరవీధులలో నడుస్తారు. నగర ప్రజలు కూడ కన్నీటితో వారిని అనుసరిస్తారు. కంటకాశ్వం కన్నీటితో రాజప్రసాదం లోనికి చొచ్చుకొని పోయి తన యజమానిని పోగొట్టుకొన్న దుఃఖాన్ని, బాధను వ్యక్తం చేస్తూ గట్టిగా సకిలిస్తుంది. పట్టపురాణి గౌతమి దుఃఖిస్తూ ఉంటే, అంతా దుఃఖలో మునిగిపోతుంది. రాకుమారి యశోధర దుఃఖం ఊరట లేనిది. శుద్ధోధన రాజు శోకంతో మూర్ఛపోతాడు. తనకుమారుని తీసికొని వెళ్లిన ఆశ్రమస్థలం చూపించవలసిందిగా కంటకాన్ని గద్దించి అడుగుతాడు. బుద్ధుని జీవితంలో తన యజమాని యెడబాటుకు కంటకాశ్వం దుఃఖం హృదయాన్ని కదలించి వేసే అత్యంత కరుణా రసపూరితమైన ఘట్టం.

10వ చిత్రం: ఇది ఒక పగిలిపోయిన శిల్పఖండం. అందులో రెండు పంజికలమధ్య పుష్పపట్టికలు, మరియొక మూల భక్తిపారవశ్యంలో మునిగిన మానవ మూర్తి శిలాపట్టిక కానవస్తాయి. ఇదీ పుష్పపట్టికతో రెండుగా విభజించబడిన శిల్పం.

11వ చిత్రం: పై పంజికలో పౌరాణిక జంతువులు– అందులో ఒకటి రెక్కల సింహం-కనిపిస్తాయి. క్రింది పంజిక అంజలిహస్తుడైన ఒక రాజవంశీకుని శిరస్సును చూపిస్తుంది. అది స్పష్టంగా ఒక పాలకుని మూర్తి అని చెప్పవచ్చు. ఎందుకంటే ఆ మూర్తి యొక్క శిరోవేష్టనం నగలతో కూడి ఉంది. అందులో ఒక పెద్ద వజ్రం దానిపై రెండు పెద్ద సువర్ణ బంధనాలు వున్నై.

12వ చిత్రం: ఇది కూడ ఒక శిల్పశకలమే. అది ప్రథమ సందేశం యిస్తున్న బుద్ధుని మూర్తుల వరుసను చూపుతుంది. బుద్ధుడు పద్మాసనంలో ఉన్నట్లుగా చూపబడింది.

13వ చిత్రం (ఏ) (బి): ఇటీవలనే అమరావతి ఆలయ తూర్పు ద్వారం పైన గోపురం కట్టడానికి గాను త్రవ్విన పునాది కందకంలో కనుగొనబడ్డ శిల్పాలకు సంబంధించినవి. వీటిలో బాగా గమనించ తగిన మూర్తి– కాళ్ళు వెనుకకువంచి ఉన్న పురుషుడు బహుశా ఒక గంధర్వుడేమో. ఈ భంగిమ దేవాలయాల మీద సాధారణంగా గాలిలో ఎగురుతూ కనిపించే గంధర్వుల భంగిమకు సాదృశంగా ఉంది. నాభి పైనుండి ఉన్న అతని శరీరభాగం నిట్టనిలువుగా ఉంది. అతని జుత్తు వెనుకకు ముడివేయబడి ఒక పట్టీ చేత బంధించబడి ఉంది. పొడుగైన చెవి తమ్మెలకు అతడు బరువైన కుండలాలు ధరించి ఉన్నాడు. కంకణాలు ధరించి ఉన్న అతని కుడిచేయి ఎవరినో వారిస్తున్న రీతిలో ఉంది. ఇది బహుశా మిథున జంటలోని ఒక మూర్తి అయి ఉండవచ్చు.

13వ చిత్రం (సి): దంపతులలోని నగ్న స్త్రీమూర్తి యొక్క విరిగిపోయిన భాగం కనిపిస్తుంది. మూర్తి యొక్క బొడ్డు క్రింది శరీరభాగం మాత్రం ఉంది. ఆమె కుడికాలు తొడవరకు విరిగిపోయి ఉంది. అది పురుషుని కాలితో మెలివేయబడి ఉండి ఉంటుంది. నడుం భాగం ఎడమవైపు న అలింగన భంగిమలోని పురుషుని చేతి వ్రేళ్లు ఉన్నాయి. ఉదరం కింద ఒక వెడల్పైన పట్టీ ఉంది. బొడ్డు క్రింద ఒక త్రాడు కట్టబడి ఉండడం గమనించవచ్చు.

14వ చిత్రం: మానవాకృతితో కూడిన మేకవలెనున్న ఒక పౌరాణిక జంతువు యొక్క పగిలిపోయిన భాగం, రౌతుయొక్క శరీరం నడుం క్రింది భాగం మాత్రం కనిపిస్తుంది. ఆ జంతువు కూర్చున్న భంగిమలో చెక్కబడినట్టు కన్పిస్తుంది. అసహజమైన రూపం యివ్వడం కొరకు దట్టమైన కొమ్ములు, గుండ్రని కనుగుడ్లు తీర్చబడ్డాయి. ఆ జంతువుతో పోల్చి చూస్తే దానిపై నున్న మానవశరీరం చాలచిన్నది. హిందూపురాణాల ప్రకారం మేక లేక పొట్టేలు, అగ్నిదేవుని వాహనంగా భావించబడుతోంది. హిందువుల గ్రహరాశి చక్రంలో "ఏరీస్" నక్షత్ర సముదాయాన్ని మేషరాశి అంటారు. హిందు, బౌద్ధ పురాణాల ప్రకారం, మేషరాశి అధిపతి అగ్నికుడైన కుజుడు. మేషం లేక మేకను, కుజగ్రహమైన అగ్నికి వాహనంగా భావించడానికి యిది కారణమై ఉండవచ్చు.

15వ చిత్రం: కూర్చున్న భంగిమలో విరిగిపోయిన ఒక పౌరాణిక ఏనుగుది. తాబేలు ఒకటి ఆ ఏనుగు మీద ప్రాకుతూ వెళ్లి తలమీద కూర్చుంటుంది. తాబేలు తల ఏనుగు యొక్క కుడికన్నును కప్పుతున్నట్లుగా చూపించబడింది. బౌద్ధపురాణంలో మానవ ప్రపంచంలోకి దిగివచ్చిన సిద్ధార్థునికి ప్రతీకగా తెల్ల ఏనుగును పరిగణిస్తారు. తూర్పు దిశను సంరక్షిస్తున్న ఇంద్రుని వాహనంగాకూడ భావించబడుతోంది. రాయి దొలిచి చేసిన కొన్ని బౌద్ధ గుహలలో ఏనుగుతల గల యక్షుడు భూభారాన్ని వహించే భారవాహకుడుగా చిత్రించబడ్డాడు. తాబేలుకు కూడ అటువంటిపనే అప్పజెప్పబడింది. క్రమేణా ఆభూజలచరం విష్ణువు యొక్క ఒక అవతారంగా భావించబడింది.

16వ చిత్రం: వెడల్పాటి త్రాళ్లు, పూసలుగల పట్టీతో అలంకరించబడిన వృషభ శరీరంపై భాగంలో ఒక ముక్క, ఆ పట్టీ వ్రేలాడుతున్న కుచ్చులతో, గుండ్రటి నలచదరపు గులాబుల సముదాయంతోఉంది. మెడ దగ్గర మరొక మూడు త్రాళ్ళ పట్టీ ఉంది. అలంకరించబడిన వృషభం హిందూ దేవాలయాలలోని నందిని తలపింప జేస్తుంది. వృషభం బౌద్ధులు, హిందువులు యిరువురికి కూడ ముఖ్యమైనదే. సిద్ధార్థుడు వృషభ నక్షత్రరాశిలో జన్మించాడని అంటారు— హిందువులు వృషభాన్ని శివుని వాహనం చేశారు. మూర్తి పూర్తిగా పగిలిపోయి యించుమించు శరీరభాగం అంతా లోపించి ఉండడం మూలాన అది వృషభమో, గుఱ్ఱమో నిర్ధారణగా చెప్పడం కష్టం. బౌద్ధ చిహ్నాలన్నిటిలోను జీనుతో నున్న గుర్రం సిద్ధార్థుని కంటకాశ్వానికి ప్రతీకగా చూపబడుతోంది. అది ఇక్కడ జరుగలేదు— నిజంగా ఇది వృషభమే అయిఉంటే అది తరువాతి హిందూ శిల్పికి ప్రేరణ ఇచ్చి ఉండాలి.

17, 18, 19వ చిత్రాలు: బౌద్ధ స్తూపభాగమైన 'యష్టి' దృశ్యాలు. హార్మిక పైన ఛత్రం యష్టి లోపల నిలబెట్టబడుతుంది. వైదిక సాహిత్యంలో, తరువాత సాహిత్యంలోను కూడ యీ 'యష్టి'ని గురించిన ఉల్లేఖనం మనకు కనిపిస్తుంది. దాని గుండ్రని నిడుపాటి భాగం **(shaft)** లేక ఇరుసును తెలియజేస్తూ ఆధిపత్యానికి ప్రతీకగాను, అది ప్రాపు నిచ్చే చిన్న గొడుగు (ఛత్రం) రాజరికానికి ప్రతీకగాను ఉన్నాయి. హెర్మన్ గోయెట్జ్ అభిప్రాయం ప్రకారం 'యష్టి' లేక స్తంభం మరియు దానిమీద ఛత్రావళులు ఉన్నతమైన స్వర్లోకాలు, వాటివెంట భావాతీత స్థితిలో లయమవుతుండడానికి సూచికలుగా ఉన్నాయి. అందుచేత 'యష్టి', అనేక లోకాలతో కూడిన స్వర్గానికి సుదీర్ఘమైన అరోహణను సూచిస్తుంది. యూపం స్తూపానికి సాంకేతిక రూపం అని వి.ఎస్. అగర్వాలా సూచిస్తున్నారు. ఆయన యూపానికి, స్తూపంకి మధ్యకల సాదృశ్య విషయాలు నాలుగు, సారూప్యాన్ని ఇట్లా తెలియజేస్తున్నారు.

(అ) భూమి లోపల నుండే యూప లేక స్తూప భాగం, ఎవరి జ్ఞాపకార్థమై ఆస్తూపం నిర్మించబడిందో, ఆగతించిన పూర్వీకులు లేక పితరులకు చాలపవిత్రమైనది.

(ఆ) భూమిపై నుండి కటి సూత్రం వరకు వున్న భాగం మానవ ప్రపంచానికి పవిత్ర మైనది.

(ఇ) కటి పైభాగం దేవతా ప్రపంచానికి పవిత్రమైనది.

(ఈ) అగ్రవలయం లేక అన్నిటికంటె ఎత్తున ఉన్న భాగం మూల దేవతలకు పవిత్ర మైనది. (arche type god).

యష్టి హర్మిక మధ్యలో బిగించ బడి ఉంటుంది. దానిలోని ఎక్కువ భాగం అండంలోనికి లోతుగా నాట బడుతుంది. ఈ శిల్పాకృతిని హిందూ దేవాలయ నిర్మాతలు అనుకరించి ఉండాలి. విమానాగ్రంనుండి స్తూపి లోతుగా చొచ్చుకొని వుండడం మనం చూస్తాం. దాని అడుగు భాగంలో సాధారణంగా గర్భపాత్ర రాయి లేక లోహంతో తయారైన అవశేషపాత్ర అయి ఉంటుంది. బౌద్ధ స్తూపాల్లో బుద్ధుని లేక అర్హతుల అవశేషాలు భద్రపరచబడి ఉంటాయి. హిందూ దేవాలయా లలో భూమాతకు ప్రతీకగా ఆపాత్రలో నవధాన్యాలు, పంచలోహాలు, నవరత్నాలు వుంటై.

అమరావతిలో కనుగొన్న యష్టి వివిధ ఆకారాలలో విభజించబడి ఉంది. అట్టడుగుది అష్టలక రూపంలో ఉంది. దానిపైన అల్లిక తోరణాలతో కూడిన వర్తుల స్తంభం ఉంది. దానిపైన ముందుకు చొచ్చుకున్న గుండ్రని భాగం ఉంది. దాని కైవారం మీద కొన్ని పిశాచ మూర్తులున్నాయి దానిపైన తిరిగి పుష్పాకృతులు కలిగిన వర్తుల స్తంభం ఉంది. దానిపైన వృషభం, ఏనుగు, అడవిపంది, గుర్రం మొదలగు జంతువుల చిత్రసమూహం ఉంది. దానిపైన చదునైన స్తంభ శిరోభాగం ఉంది దీనిపైన ఛత్రావళిని అమర్చేందుకు పద్మాకారపు ఆధార పీఠం వుంది.

అమరావతి వద్ద దొరికిన ఈ యష్టి చాల అరుదైన కళాఖండం. అటువ టిది మరెచ్చట కూడ యింతవరకు కనపడలేదు.

20 వ చిత్రం: ఒక స్తంభం పైభాగాన యిరువైపుల గుజ్జాల మూర్తులున్నాయి. ఈ స్తంభాగ్రాన బాగా అరిగిపోయిన ధర్మచక్రం వుంది. అత్యంత అలంకారయుతమైన ధర్మచక్రం ప్రతిమ యిది.

ఇటీవల అమరావతిలో కనుగొనబడిన ఈ శిల్పాలు చూసి చివరకు చెప్పాలనిపించేది ఏమంటే ఆంధ్ర అమరావతి శిల్పకళ పరిపక్వదశకు చెందినదని, శిల్పి వున్నతదశకు చేరుకున్నాడని.

ఈ శిల్పాలు శాతవాహన సామ్రాజ్యం మహోన్నత కీర్తి సౌభాగ్యాలతో తులతూగుతున్న క్రీ. శ. రెండవశతాబ్దానివి. ఆనాటి శిల్పకళలో ముఖ్యంగా మానవమూర్తులు, జంతు ప్రతిమలు

చిత్రీకరణలోను, ప్రాచీన అలంకారవలయాలు ((medallium) చెక్కడాలలోను, అలంకరణ స్థాయిల్లోను కానవచ్చే కళాపరిపూర్ణత, దీప్తైన సాదృశ్యం దేశవిదేశాలలో ఎచ్చటను కానరాదు మౌర్య యుగానికి చెందిన కళాత్మక శిల్పాలు, శిలాపట్టికలు (motifs) ముఖ్యంగా నంది, అశ్వం, సింహానికి సంబంధిచినవి యిక్కడ కొనసాగటం మనం చూస్తా . అదే సంప్రదాయాన్ని తూ.చ. తప్పకుండా పాటిస్తూ వచ్చిన తరతరాల భారతీయ కళాకారులు, అమరావతి కళను అమరం చేశారు అమరుల పట్టణమైన అమరావతి యొక్క ప్రభావం ఆంధ్ర అమరావతికి చెందిన బౌద్ధ శిల్పాల కళాసాంప్రదాయాలను పాటిస్తూ వచ్చిన భారతీయ శిల్పకళ అనబడే జలతారుపటంలో యిది ఒక సువర్ణ పోగు.

———

# చిత్రాల వివరములు

1. (ఎ) అమరేశ్వరాలయం రథం.

1. (బి) అమరేశ్వరాలయ ముఖద్వారం.

2. మండపంలో లభించిన శిల్ప ఖండాలు.

3. సిద్ధార్థుని మహాపరిత్యాగానికి ముందు

4. పైపంజిక — బోధివృక్షారాధన.

క్రింది పంజిక — అభివాదం చేస్తున్న కులీనులు.

5. బుద్ధుని సింహాసన, ధర్మచక్ర దృశ్యాలు

6. —పౌరాణిక జంతువు.

— ఆరాధన, బుద్ధ సింహాసనారాధన

7. కపిలవస్తు నగర దృశ్యాలు

8. జాతక కథా భాగం ఆకాశంలో ఎగురుతున్న మూర్తి.

9. మహాపరిత్యాగం.

10. భక్తుల పారవశ్యం

11. వివిధ దృశ్యాలు

12. బుద్ధుని ప్రథమ ధర్మోపదేశం.

13. (ఎ) పురుషమూర్తి.

(బి) పురుషమూర్తి వెనుక భాగం.

(సి) స్త్రీమూర్తి శకలం.

(డి) ఎ, బి. సి కలిసిన రూపం

14. రాతుతోవున్న మేకవంటి పౌరాణిక జంతువు

15. ఏనుగు.

16. అలంకృత శకలం వృషభ శకలం.

17. బౌద్ధ స్తూప యష్టి.

18. తూర్పు గోపుర నిర్మాణానికి త్రవ్వబడిన చోటు–అచ్చట దొరికిన

19. యష్టి వివరాలు

20. స్తంభాగ్రాన ధర్మచక్రం.

21, అమరావతి అపురూప శిల్పం.



1. (ఎ) అమరేశ్వరాలయం, రథం.



1. (బి) అమరేశ్వరాలయ ముఖద్వారం



2. మండపంలో లభించిన శిల్ప ఖండాలు.



3. సిద్ధార్థుని మహాపరిత్యాగానికి ముందు.



4. బోధివృక్ష ఆరాధనా దృశ్యాలు.



౮. బుద్ధుని సింహాసన, ధర్మచక్ర దృశ్యాలు.



౯. పౌరాణిక జంతువు, ఆరాధన, బుద్ధ సింహాసనారాధన.



7. కపిలవస్తు నగర దృశ్యాలు



8. జాతక కథా భాగం, ఆకాశంలో ఎగురుతున్న మూర్తి.



10. భక్తుల పారవశ్యం.



11. వివిధ దృశ్యాలు.



12. బుద్ధుని ప్రథమ ధర్మోపదేశం.



13. (ఎ) పురుషమూర్తి.



13. (బి) పురుష మూర్తి వెనుక భాగం.



13. (సి) స్త్రీమూర్తి శకలం



13. (డి). ఎ, బి, సి. కలిసిన రూపం.



14. రాతిలోవున్న మేకవంటి పౌరాణిక జంతువుం.



13. (డి). ఎ, బి, సి. కలిసిన రూపం.



15. ఏనుగు.



16. అలంకృత వృషభ శకలం



17. బౌద్ధ స్తూప యష్టి.



15. తూర్పు గోపుర నిర్మాణానికి తవ్వబడిన చోటు—అచ్చట దొరికిన యష్టి



20. స్తంభాగ్రాన ధర్మచక్రం.



21. అమరావతి అపురూప శిల్పం.